శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

[అయిదంకముల నాటకము.]



ప్రచండ చాణిక్యము; సారంగధర చరిత్రము
మొదలగు నాటకములు రచించిన,

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిచే

రచియింపఁబడి,

తెనాలి

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ప్రకటింపఁబడియె.

1909

 మూడవకూర్పు 1000 ప్రతులు. 

వెల 0—12—0

# పీఠిక.

---

ఇది నాప్రథమనాటకము. షట్చక్రవర్తులలో నొకఁడని ప్రసిద్ధిఁ గాంచిన పురుకుత్సునిగూర్చి శ్రవ్యప్రబంధము లేదనియెంచి దీనిని వ్రాసితిని. ఆ న 1900 సం॥ యేప్రియల్ 27 తేదిని మొదలుపెట్టి ఆన 1900 సం॥ మెయి 26 తేదిని దీనిని ముగించితిని.

ఆంధ్రభాగవతమునఁ బురుకుత్సచక్రవర్తినిగూర్చి రెండుపంక్తుల కంటె హెచ్చుగ వ్రాయఁబడి యుండకపోవుటఁబట్టి కొంతకథను గల్పింపవలసివచ్చెను. పండితులు గుణమునుగ్రహించి దోషముల నాకుదయతోఁ దెలియఁజేసినచో సవరించుకొందును.

కొన్నిసంవత్సరములక్రిందటనే గ్రంథప్రతులన్నియు విక్రయమై పోవుటఁబట్టి మహారాజరాజశ్రీ శ్రీపీఠికాపుర సంస్థానాధిపతులగు శ్రీశ్రీ రాజారావువేంకటకుమారమహీపతిసూర్యారావుబహద్దరువారుదయాపూర్వకముగ నొసర్చిన ద్రవ్యసాహాయ్యముచే దీనిని దిరిగి ముద్రింపించితిని. లోకోపకారధురీణులగు వీరికిఁ బరమేశ్వరుఁడు సర్వసౌఖ్యముల నిత్యాధికముగనిచ్చి రక్షించుగాక. ఈనడుమను వీరియాస్థానమున జరిగిన వీణాగానవినోదమున నేనొసర్చినపద్యము నిచ్చుటఁ బొందుపఱచితిని.

సీ. స్వజనుల నేరీతిఁ బరిపాలన మొసర్తు
వాశ్రితునెవ్వానినాచరింతు,
వాదాయమునసెంత యర్థ్యాళికిచ్చెద
వెదటుచేసినభృత్యునెదగణింతు,
వవనిపాలురనేదియార్జించినాఁడవు
కవితగానంబు నేకరణివిందు,
వెట్లుగాపృథుసౌఖ్యమీక్షింపఁగానుంటి
వాత్మసంస్తుతులకేమందువయ్య,

గీ. సరిగ ధని సగమ పనినిసరిగగరిమ
మరి మరిగ పాపనినిగని సరిసరియను
వీణ కాని 'మా', వెన్క 'నీ' వీణవగును
మీఁదొ 'నీ', వెన్క 'మా', సూర్యమేదినీశ.

పిఠాపురము.
9-11-09.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

## ఈనాటకమున వచ్చుపాత్రలు.

---

### పురుషులు.

పురుకుత్సుఁడు—కథానాయకుఁడు.

విదూషకుఁడు.

చిత్రకేతుఁడు—గంధర్వుఁడు.

అంశుమంతుఁడు—ఉరగలోకరాజుయొక్క ప్రధాని.

విశ్వామిత్రుఁడు—ముని

నారదుఁడు—ముని

ఇంద్రుఁడు.
చంద్రుఁడు.
బృహస్పతి.
సూర్యుఁడు. } దేవతలు.

మందారుఁడు—ఉరగలోకరాజు.

సూత్రధారుఁడు—అంతరనాటకములోనివాఁడు.

### స్త్రీలు.

నటి—అంతరనాటకములోనిది.

శచి—ఇంద్రునిభార్య.

సుమతి—పురుకుత్సునిదేవి.

కల్యాణి—సుమతియొక్క చేటి.

నర్మద—కథానాయకురాలు.

నవమాలిక—నర్మదయొక్క చేటిక.

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

నాంది

ఉ. అందఁగరాని సీమలకు ♦ నందఁగఁజేసి ఘటింపరాని గీ
తిం దనరారు కార్యముల ♦ దిత్వరితంబుగ సంఘటించి ర
క్తిం దెరపైని బొమ్మలట్లు ♦ తేతెయితక్కలనాడఁజేసి స్వ
చ్ఛందముగాఁగ జీవతతి ♦ సాకెను లోకవిభుం దలంచెదన్.

సూ—(ప్రవేశించి) పారిపార్శ్వకా!

పారి—(ప్రవేశించి) పిలువనక్కఱలేదు. కాని నృత్యకై మనకేర్పఱుపఁబడిన తెలుగు తెయితక్కలు మనకు నీనృత్యయందుగూడఁ దప్పవా యేమి?

సూ—(నవ్వుచు) ఇప్పుడాడఁబోవు నర్మదాపురుకుత్సీయనాటకమెవరు రచియించిరో యెఱుగుదువా?

పారి—ఎఱుఁగుదును పానుగంటి లక్ష్మీనరసింహారావు.

సూ—ఔను ఇదియాతని ప్రథమనాటకము అతఁడేమతమునఁబుట్టెనో యెఱుఁగుదువా?

పారి—ద్వైతమతమునఁగాదా

సూ—ముక్తిదశాసందర్భమునఁ దన్మతసాంప్రదాయము కొంచెము హెచ్చుతగ్గుగ నీవనినట్టిదే కద!

(నేపథ్యమున) ఓహోహో!

పారి—మతసాంప్రదాయములు పూర్ణముగఁ దెలియకముందే మీరుచేసిన సిద్ధాంతమునకు వెనుకనుండి యెవ్వఁడో మహానుభావుఁడా మోదమా?

(నేపథ్యమున) ఎవ్వఁడో మహానుభావుఁడీసమయమందే యూర్ధ్వలోకమునుండి యిచ్చటికి విచ్చేసినట్లు తోఁచుచున్నది.

సూ—నాటకమారంభమైనది పాతాళవాసియగు నంశుమంతుఁడు స్వర్గవాసియగు చిత్రకేతునిగూర్చి యిట్లుపలుకుచున్నాఁడు. మనము లోనికిఁ బోవుదము.

(నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.

---

*

శ్రీ.

# నర్మదాపురుకుత్సీయము.

## ప్రథమాంకము.

రంగము — విశ్వామిత్రాశ్రమపరిసరారణ్యభూమి.

[ఊర్ధ్వలోకమునుండి చిత్రకేతుఁడును, నరకలోకమునుండి యంశుమంతుఁడు నేక కాలమున చెఱియొకవైపునకుఁ బ్రవేశించుచున్నారు.]

అంశు — ఓ చెలీ! ఎవ్వఁడో మహానుభావుఁ [illegible] యూర్ధ్వలోకమునుండి యిచ్చటికి విచ్చేసినట్లు తోఁచుచున్నది.

గీ. ఉరగదేవలోకంబుల ♦ నుండి యొకట
దిగితి మిచ్చట వేర్వేఱు ♦ దిక్కులందు
ప్రాగ్గిరి శశి, ప్రతీచిని ♦ భాస్కరుండుఁ
బూర్ణిమాసంధ్య నొకసారి ♦ పొలుచునటుల.

ఆతని సమీపించి యెవ్వరో తెలిసికొనెదను.

(సమీపించి) నమస్కారము మహానుభావా!

చిత్ర — మహనీయా! అనేకనమస్కారములు.

గీ. ఎవరు మీరని యడుగంగ ♦ నితని జిహ్వా
సంభ్రమము నొంద మనసు త ♦ త్సంభ్రమంబు
బాపలేదయ్యెఁ గల్లంబు ♦ బలిమిచేస
వారుబట్టిన దాఁటున ♦ శ్వంబుకరణి.

అంశు—నే నురగలోకవాసుఁడను, అంశుమంతుం డనువాఁడను, భూలోకమందలిచిత్రములను జూడ వచ్చినాఁడను. తా మెవ్వరో సెల విచ్చెదరా?

చిత్ర—నే నింద్రలోకమున నుండువాఁడను. ఇంద్రునియానతిపైని తఱుచుభూలోకమునకు వచ్చి యిచ్చటివి శేషము లాతనికి విన్నవించుచుందును. చిత్రకేతుఁ డని నన్నుఁ బిలుతురు.

అంశు—ఆహా! చిత్రదర్శనార్థమై వచ్చిననాకు చిత్రకేతుదర్శనమే ప్రథమమం దయ్యెఁగదా! ఇఁక ముందు చిత్రమున కేమికొదువ? అయ్యా! మనయాకస్మికసఖ్య మత్యంతసౌఖ్య ప్రద మగుఁగాక.

చిత్ర—మిత్రమా! చింతనాపూర్వమైన సుఖముకంటె ఆకస్మికసుఖమే వేయిమడుంగు లధికమునుమా!

అంశు—సందేహ మేమి మిత్రమా! ఇంద్రునకు క్షేమమే కదా.

చిత్ర—వయస్యా! ఏల యిట్లడుగుచుంటివి!

గీ. మూఁడులోకంబు లేలుచుఁ ♦ పూర్ణభోగి
కేల యక్షేమములు గల్గు ♦ బేలసఖుఁడ!
సుధకు నాకరమైనట్టి ♦ విధున కేల
చల్లఁదనమున కొకలోటు ♦ సంభవించు?

అంశు—మిత్రమా! అది సరి కాదు. త్రిలోకరాజ్యభారనిర్వహణశీలుఁడని చెప్పితివికదా.

గీ. కార్యపూర్వాపరుఁ డగువాఁడు ♦ గాసిఁ జెందుఁ
గార్యభారంబు లేకున్నఁ ♦ గడు సుఖించుఁ
జలను బసుపున్నవాఁడు భా ♦ ధను వహించు
లేనివానిసి నిదురను ♦ మేను మఱచు.

మూఁరాజుగారు నేఁడొక కార్యభారంబునఁ జింతాక్రాంతులైయున్నారు.

చిత్ర—అట్టికార్య మేదైయుండు నని నే నడిగిన మన్నింతురుగాక.

అంశు—అయ్యా! మఱి యేమియు విశేషము లేదు.

గీ. పసిమిమిసమిసకలక్రొత్త ♦ వయసు సొసఁగు
సుతకు నర్మద కనుకూల ♦ పతిని గూర్చు
వంతచే నున్నవాఁ డాఁడు ♦ బడుచుఁ గాంచు
వారి కందఱి కది తల ♦ వ్రాఁత కావె?

చిత్ర—కర్ణములకు భూషణములుగ మీనర్మదాసౌందర్యకథన మెన్ని మాఱులో వినియున్నాను.

ఆ. వె. అట్టిదాని నీయ ♦ నగుఁ జక్రవర్తికి
ఘనున కీయరాదు ♦ సురల కొసఁగ
కంబుజాక్షునకునె ♦ యచ్ఛసాలగ్రామ
మాల భక్తుఁ డిచ్చు ♦ మాడ్కిఁ గాఁగ.

అంశు—ఓహో మిత్రమా! చక్రవర్తి యని బాగుగ జ్ఞాపకము చేసితివి! ఈమహీకాంతను తనభుజపీఠిని లాలించునతఁ డిప్పుడు పురుకుత్సుఁ డేకదా! ఆతఁడుమహాభాగ్యసంపన్నుఁడును, విశేష శేముషీసనాథుండును, సర్వలక్షణసంపూర్ణుఁడును, కాంతాజననవీనకుసుమసాయకుండు నని శ్రవణానందకరముగ విన్నవాఁడనే కాని నేత్రసాఫల్యముగఁ జూచియుండ లేదు. మిత్రమా! మీ రెప్పుడైన నాతనిఁ జూచితిరా?

చిత్ర—చూచుటయే కాదు. చూచి యపరిమితానందమును గూడఁ బొందితిని. కొన్ని దినములక్రిందట నొకనాఁడు,

గీ. వేఁట నొకఁ డిరు చేతుల ♦ నీటెగవను
బట్టి కరిరాజసంఘంబు ♦ భంగపఱిచె
బాలభానుండు దనకిర ♦ ణాళిచేత
నంధకారంబు సమయించు ♦ నట్లుగాఁగ.

(అంత తెరలోఁ బెద్దకలకలము)

గీ. భవ్యతేజస్కుఁ డీచక్ర ◆ వర్తిఁ గాంచి
యాటవికజంతువులు చేష్ట ◆ లణఁగి సొలసె
పక్షిరాజేంద్రు నీక్షించి ◆ పడగ లవని
వ్రాల్చి నిశ్చేష్టతను బొందు ◆ పాములెల్ల.

అంశు—ఓహో! ఏమి నాయదృష్టము! మిత్రమా! ఆమహాచక్రవర్తి వేఁటమార్గమున నియ్యెడకే వచ్చునట్లు తోఁచుచున్నది.

గీ. ఆతనిని నేను దర్శింప ◆ యత్నపడఁగ
నాకడ కతండె వచ్చుచుం ◆ డఁగఁ బోలు
ఫలము గ్రహియింపఁ జూతాగ్ర ◆ భాగ మెక్క
నుండఁ దటుకునఁ జేబడు ◆ పండురీతి.

చిత్ర—మిత్రమా! అట్లె సూనుము! అట్టి యపూర్వదర్శనమువలన యథార్థముగ సఫలుఁడ వైతివి కదా.

గీ. వెడదయురమున గిరజాలు ◆ వ్రేల సూక్ష్మ
మధ్యుఁడై వచ్చు నల్లదె! ◆ మందసఖుఁడు
వెంటరా, నక్కపోతుతో ◆ వెంటనంటి
రాఁగ విహరించు కేసరి ◆ రాజుపోల్కి.

అంశు—ఈమహారాజు నే నెన్నఁడును జూచియుండకపోయినను నీ నిమిష మందీతని దూరమునుండి చూచినంతమాత్రముననే చెప్ప నలవికానియనురాగమును, బంధుప్రేమయు నీతనియందు నాకేమో యకారణముగఁ గలుగుచున్నది.

చిత్ర—సఖుఁడా! అట్టివికార మందఱకును సహజమేసుమా!

గీ. పుణ్యసంబంధములు రాక ◆ మునుపె వాని
భావిఫలములు కించిత్తు ◆ పరిభవించు

వర్ష రహిత మైనను మృగ • శీర్షయుక్తి
వసుధ కిసుమంత యుపశాంతి • వచ్చుఁ గాదె.

కాశ్యప మిత్రమా! నీయీమనస్స్థితినిఁబట్టి చూడఁగ మీనర్మదకీ తఁడు పతి కాఁగలఁ డని తోఁచుచున్నదిసుమా!

అంశు—నీయూహ యారాజరాజుగూడ స్థిరపఱుపవలెనుగదా. మిత్రమా! తిరస్కరిణిచేఁ బ్రచ్ఛన్నులమై యిక్కడనే యుండి వీరిసంభాషణము విందము.

చిత్ర—అట్లే.

(అంతట రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు)

విదూ—నిన్నటిరో వధింపఁదగినభక్ష్యమృగములను దినలేక గ్రుడ్లు మిటకరించుకొని యటునిటు జూచువానివలె నామ్మపిలిభీతిచే నిశ్చేష్టతను బొంది పాదాక్రాంతము లైనవేఁటజంతువులను జంపలేకపోయితివి!

పురు—(నవ్వుచు) ఆహా! విప్రవర్యా! శూరధర్మము నెంతబాగుగ వెల్లడించితివి! గర్వాత్ములకు గాక సవినయులకు శిక్ష యేల?

అంశు—ఈచక్రవర్తి మృదుమధురగంభీరభాషణములు నామనస్సునకు సంగీతమువలె నాహ్లాదమును గలుగఁజేయుచున్నవి.

విదూ—ఎట్టిదైన మిత్రమా! అందఱును బైరాగులైన నూరఁబూలదండ లమ్ముకొనువానికావడిమోఁత యెంతసార్థకమో నీధనుర్భారమును నాకఱ్ఱమోఁతయు నంతసార్థకమేకదా?

అంశు—మిత్రమా! ఇంతదివ్యమంగళవిగ్రహమును నేను చూచియుండను. ఇతఁ డల్లుఁడుకాఁగలమహాభాగ్య మురగలోకాధిపతి కెన్నఁడగునోకదా.

పురు—మిత్రమా! ఇంతకుముందు మనము సంచరించినయరణ్యభాగముకంటె నీయరణ్యభాగము విలక్షణముగ నున్నది.

సీ. ఫలభారమునఁ జెట్లు ♦ వంగెను పక్వత,
త్త్వజ్ఞానమునను వి ♦ ద్వాంసులట్లు
కొండనేత్రమ్ముల ♦ నుండి నీరము పారు,
సరసులకరుణారస ♦ సమ్మ్రభంగి
నళినీతయుతతరు ♦ లలరుల రాల్చున,
లరుటంజలులు సూత్ర ♦ ధరులవలెను
వివిధపక్షులకల ♦ రవము లేకంబయి,
భాసిల్లు బలుమేజు ♦ వాణివలెను

గీ. పచ్చికజయస్లు, కొలఁ ♦ కులు, భర్మలతలు,
జాజిమంకెనలపొదలు ♦ సరసవస్తు
లగతి భాసిల్లు పసపుహా ♦ లక్ష్మిమెడను
మంజుతమపంచరత్నాల ♦ మాలలీల.

ఓహో! మిత్రమా! నీమనస్సున కీవనశోభ యెక్కకున్నదికాఁ
బోలు నేమి?

గీ. సరసుమది కెక్కు వరవస్తు ♦ సారశోభ
మూఢుమది కెక్కునే? గాజు ♦ బుద్దిలోనఁ
బ్రతిఫలించెడుదీపిక ♦ వట్టిబొమ్మ
రాతిలోపల నేరీతిఁ ♦ బ్రతిఫలించు?

విదూ—నాతో మాట లాడకుము. నాకు విరహబాధ భరింపశక్యము
గాకుండ నున్నది.

పురు—రసహీనుఁడ వని యాక్షేపించితి ననియా! విరహభారవహుఁడ
నైతి నని చెప్పుచు రసజ్ఞతను కొనితెచ్చుకొనుచున్నావు?

గీ. వస్తుసుగుణగ్రహణశక్తి ♦ భవముతోడఁ
బుట్టవలెఁ గాక కొనితెచ్చి ♦ పెట్టఁ గలమె?

సహజమాధుర్యకవితాప్ర ♦ శస్త్రధార
సలవరచుకొన్న నేరీతి ♦ నందవచ్చు?

అయినను మిత్రమా! నీవిరహబాధకు కారణమేమొ చెప్పుము.

విదూ—ఈయాకాశమే కారణము.

పురు—తెలివితేటలందు నీకు కనిష్ఠసోదరు లైనయాపక్షులు నిన్ను విడిచి యాకసమున నెగురుచుండ వానిని జూచుటచేతనా నీ కీవిరహబాధ తటస్థమైనది?

విదూ—అట్లుకాదు. గాఢాంధకారబంధురం బైనయామనస్సునందలి రహస్యము పిల్లికన్నులవాఁడు గ్రహించవలెఁ గాని నీవలన నేమగును?

పురు—ఆరహస్య మేదియో శీఘ్రముగఁ జెప్పుము.

విదూ—ఆకాశముఁ జూచినంతమాత్రమున విరహ మొదలుకు కలిగిన దనఁగా నూది మోపనెడము లేకుండ మసూచిమచ్చలచే నిండిన నాప్రియురాలిమోము నీచుక్కలచేనిండినయాకాశము నాకు జ్ఞాపకము చేయుచున్నది.

పురు—(నవ్వుచు) ఆహా! ఏమి నీయదృష్టము!

విదూ—ఇంకను వినుము. ఆకాశమునందుఁ బ్రకాశించెడునీచంద్రుఁడు నాప్రియురాలిమోమునందలి యొంటికంటిని స్మరింపఁజేయుచున్నాఁడు.

పురు—నక్షత్రాగమమును, చంద్రుని నెంతబాగుగ వర్ణించితివి! చాలు. అదిగో! చూడు మాదిక్కున కొండకాలువయొక్క తూరుపుగట్టున పుష్పించియున్న యశోకవృక్షముక్రీనీడనుగాఁబోలు నేదియో యొకమృగము నీరు ద్రావుచున్నట్లు గన్పట్టుచున్నది. బాగుగఁ బరిశీలించుము.

విదూ—చిత్తము (ఆదిక్కునకుఁ జూచుచున్నాఁడు.)

చిత్ర—సీ. వరధనుఃపాణి యగుచు ర ♦ వలతురాయి
దాల్చి సఖుతోడ నీరాజు ♦ వొల్చుచుండ
వీఁక భృంగితోఁ గూడుచి ♦ నాకపాణి
యైనచంద్రార్ధశేఖరు ♦ ననువు మెఱసి.

అంశు—ఆ. అట్టిశంకరునకు ♦ నర్ధాంగలక్ష్మిగాఁ
దుర్గ యయినరీతి ♦ దురితదూరుఁ
డితని కురగరాజ ♦ సుత దేవి యగునట్లు
హితులు మన లనుగ్ర ♦ హింత్రుగాక!

చిత్ర—హోమధూమవాసన కొట్టుచున్నది సమీపారణ్యభాగము మున్యాశ్రమ మైయుండనుకదా!

అంశు—అయినఁ బ్రమాద మేమి?

విదూ—నీవుచెప్పిన పుష్పించినయశోకవృక్ష మిప్పటికి నాకంటఁ బడినది.

పురు—ఇఁకను బాగుగఁ బరిశీలించుము.

విదూ—మిత్రమా! జంతు వని బ్రమసి పిలువఁగదా! సన్నముననఁ బూయు టచేతఁ దెల్లఁబడినకుండ పై మునిబాలురు పెట్టి యీయశోకవృక్షమునకు దృష్టిదోషము తగులకుండ నెవ్వరో దానిమొదట నుంచినదృష్టిపిడతసుమా!

చిత్ర—నీకంటె దృష్టిపిడత మఱెవరు?

పురు—సీ. పచ్చనిశరీరమున జిగ్గు ♦ మచ్చ లొలయఁ
గంధరము సాఁచి తినముందు ♦ కాలుమోపి
చెవుల వెనుకకు నిక్కించి ♦ చెలఁగి నీరుఁ
ద్రావుచున్నది చింకనై ♦ తవరవచ్చు.

అయినను మిత్రమా! దానిపార్శ్వభాగమునూత్రము కొంచెము కనఁబడుచున్నది. నీవుకూడ జాగరూకతతోఁ గనిపెట్టుము.

విదూ—ఇఁక కనిపెట్ట నవసరము లేదు. అదిగో! ప్రేలరియొక్క నాలుక వలె బారెడుతోఁక కూడ నాడించుచున్నది.

పురు—తల మిక్కిలి చిన్నదిగను, తోఁక మిక్కిలి పొట్టిదిగను, కనఁబడుచున్నది. చిఱుతపులి కాదని తోఁచుచున్నది.

విదూ—ఆలాగున నూహింప వీలు లేదు. బుద్ధిహీనమైన చిఱుతపులికి తల చిన్నదిగనే యుండును. శూరుఁ డెవ్వఁడైన తోఁక నట్లే యుండవచ్చును. ఈవిధముపేటు బుద్ధినికషయూచనవలె శూన్యమును, మీఁదిమిక్కిలి లజ్జాకరము నైనదికావున మిత్రమా! శీఘ్రముగా బాణమును సంధించి టంగున రాతితో గొబ్బునఁ బచ్చి నూరుగొట్టునట్లు దానితలఁ గొట్టుము.

పురు—ఇదిగో! బాణము సంధించితిని. (కొంచెము సేపూరకుండి) మిత్రమా! ఎందుచేతనోకాని మనస్సు మిక్కిలి కలతనొందినదిసుమా!

గీ. తోఁచ కొక్కపరి దిగులు దోఁ ♦ చుచును మఱియు
కప్పును కుమికలంబడును ధై ♦ ర్యంబు దక్కి
దైన్య మూఁదగ నొకసారి ♦ ధాటి లేచుఁ
బైకి నుబ్బుచుండుమనసు బక ♦ వానిఁ బోలె.

విదూ—నే నిప్పుడు బాగుగఁ బరీక్షించితిని. చిఱుతపులియే గాని వేఱొండుగాదు. తల్లక్రిందను కన్నులు చేరి చెట్టును పాడుచేసినట్లు లేనిపోనిసందేహములు మనస్సును పాడుచేయును.

పురు—మిత్రమా! నాయెడమకన్నదురుచున్నది. ఏమికీడు తటస్థపడునో కదా.

విదూ—శకునములు, స్వప్నములు మనోదౌర్బల్యముగలవారిని బాధించవలసినవి కదా.

పురు—నిశ్చయముగా నాకును చిఱుతపులివలెనే కనఁబడుచున్నది. ఇదిగో బాణమును వదలెదను.

(అంతట విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విశ్వా—గీ. సహజనిర్దోష మది ముని ♦ సంగతిని మ
లింతనిర్దోష మద్దాని ♦ హాంత! గూర్చి
తౌర! స్ఫటికము మఱి దేవ ♦ తార్చనంపు
పెట్టెలోనిది పగులంగఁ ♦ గొట్టినటులు.

ఛీ! నీమోముచూడరాదు. (అని వెనుకకుఁ బోవ యత్నించుచున్నాఁడు.

పురు—(అంతలో పురుకుత్సుఁ డతనిపాదములమీఁదఁ బడుచున్నాఁడు)
మహానుభావా! క్షమింపుము.

విశ్వా—లెమ్ము లెమ్ము.

విదూ—ఁఁబ్రాహ్మణోత్తమా దండముతో సరి, యస్మదిష్టులోమునికులతిలకా!
ఈచక్రవర్తిని క్షమించవలయును.

విశ్వా—(తనలో) ఓహో! పురుకుత్సుఁడా యితఁడు?

పురు—గీ. ఆశ్రమాక్షత యొక్కటి ♦ యుపల దుప్పి
పురుగ నెమ్మిట మఱి యొంటు ♦ మునులు మిమ్ము
జూడ నజ్ఞతాదోషము ♦ క్ష్వేడసున్నె?
బాలతరశిరాకను మంచు ♦ బాయునటులు.

విశ్వా—(తనలో) విశ్వామిత్రుఁడనైన నాకును చక్రవర్తినైన యీపురుకు
త్సునకును సమానప్రమాదములే తటస్థించినవి కదా.

గీ. మునులమ్మ మాంచు నెఱుఁగక, ప్రలియుటంచు
తీవ్రనారాచహతి వీఁడు ♦ ద్రెళ్లఁ జేసెఁ
జక్రవర్తిగ నెఱుఁగక ♦ జకఁ డటంచుఁ
దీవ్రశాపాశుగమునఁ బెం ♦ త్రిప్పిని యితని.

(ప్రకాశముగా) రాజా! భయపడకుము.

అంశు—శీఘ్రకోపికి పశ్చాత్తాపప్రారబ్ధ మెన్నఁడు నున్నదే కదా.

పురు—ఓమహర్షి చంద్రమా!

గీ. చక్రవర్తిని మునులయా ♦ శ్రమములందుఁ
నీవుబోరయుకయుండ ర ♦ క్షించుభార
మీతలనె యున్నచో మేర ♦ నెఱిఁగిమీరుఁ
గలనె? తనసొమ్ము తాను దొం ♦ గిలుట యెటులు?

అయినను, ఓమునిశార్దూలమా!

గీ. ఏను రాజను; మీరు మ ♦ హానుభావు
లరు; ప్రమాదము నాది; యా ♦ వంతలోటు
మీకు; కొండంత శాపము ♦ నా కిడితిరి;
శత్రుఁ డొకనాఁక గిరిశిఖ ♦ నలుపుకరణి.

విదూ—మహర్షి చంద్రమా! మాంధాతయొక్క పుత్త్రు నితని కటాక్షింపుము.

విశ్వా—(తనలో) నాకు మిక్కిలి ప్రేమాస్పదుఁడైనమాంధాతకు కొడుకనికూడ జ్ఞాపకము రాకుండుటచే మఱింత చింతగ నున్నది.

విదూ—(తనలో) లింగముమ్రింగినపూజారివలె నీముని మాట్లాడఁ డేమి?

విశ్వా—భయపడకుము వత్సా! ఊఱడిల్లుము.

పురు—భయపడకు మని సెలవిచ్చితిరి గాన మనవిఁ జేసెదను.

గీ. నీదుకోపాగ్నిఁ గలిగిన ♦ నాదునెడుపు
చిచ్చు లిరిగి నీలోనికిఁ ♦ దెచ్చుకొనుము
ధాత్రిబాధించుమిత్త్రోగ్ని ♦ తగ్రపఱచి
తిరిగి మిత్త్రునిఁ జేసిన ♦ కరణి గాఁగ.

విశ్వా—నీవు వదలినబాణమును నీవు వెనుక కాకర్షింపలేనట్లు నేనును నాశాపమును మఱలింపలేను. కాన సత్యలోకగతి స్వల్పకాలమైనను దప్పదు.

పురు—తప్పదా! మునికులసార్వభౌమా!

గీ. బ్రహ్మసృష్టించునిత్వకు ♦ పాశజాలకు
సుకలోకమె గతి యింత ♦ పలుకు నీవు
భద్ర! తపస్వినికీవు ♦ బ్రహ్మవిగాదు
నాకభోగకగతినిచ్చి ♦ నాపఁగాదె.

అంశు—మహాను! రాజా! బాగుగ సెలవిచ్చితివి.

చిత్ర—సెలవిచ్చిన బాగుగనే యున్నను.

విదూ—మహర్షి శేఖరా! శాపమునకు గమ్యమైనను సెలవిమ్ము.

పురు—మిత్రమా! గమ్యపుఁబోవలనిచేమి?

గీ. ద్వ్యాముకీ కులజుఁడనగు నాకు ♦ ఘోరగతి రాక
ఘటిలెగా నేమి వేయేండ్లు ♦ గాఁగ నేమి
యతి వ్యభిచరించువాఁడైన ♦ నాతఁ డేల
కాల మొందట్లో సను ♦ గమ్ము లేల?

విశ్వా—(తనలో) (మైవద్యముయొక్క కడపటి రెండుపాదములు తిరిగి చదివి) ఆనుసీతనియూంట లాతని శాపముకంటెను నాశాపముకంటెను దీక్ష్ణతరములై మేనకాసంగమమును నాకు జ్ఞాపకము చేయుచు మర్మములు నాటపోవుచున్నవి గదా.

అంశు—ఆహా! రాజేంద్రా! శాపమిచ్చినమునిసింహ మెదురుగ నుండ గగడునుగుఱించి నీ వడుగకపోవుటయేగాక నీప్రియసఖుఁడ డిగిన నెంతనిర్లక్ష్యముగ గమ వవసరము లేదని చెప్పితివి!

చిత్ర—

గీ. సుగతి లేదని యెఱుఁగుసీ ♦ సుస్థిరునకు
సాహసముగాక మఱి యేమి ♦ సఖుఁడ! మాన
మంతమును బొందుగౌరవ ♦ మంతున కిలఁ
బ్రాణమన్నఁ దృణప్రాయ ♦ మానుగాదె!

విశ్వా—(సాలోచనముగా) అధోలోకగతి స్వల్పకాలమైనఁ దప్పదు.
తరువాత స్వర్గలోకమునకుఁ బోయి యక్కడ నింద్రాదిదేవత
ల దర్శించి తిరిగి భూలోకమునకు వచ్చి ప్రాణాధిక యగునీదేవి
వలన సూర్యసమానుఁ డగుపుత్త్రునిఁ గాంచి సుఖింతువు.

విదూ—(తనలో) ఏమి యీద్రావిడ ప్రాణాయామము!

విశ్వా—గీ. నీ వధోగతి నొందుచు ♦ నెమ్మి నిద్రఁ
జూడ పైకేగుచుఁ జాల ♦ సుఖము నిచ్చు
వెనుకకును గొంత పసవెగ్గి ♦ వెడలునరుఁడు
మెట్ల నెక్కుచు ముందుకుఁ ♦ బోవునట్లు.

విదూ—ఆహా! ఇంతఁ గొంత గొప్పైన హేతువును జెప్పినాఁడు! ముందు
గుర్రపుముక్కెరయోగము తప్పనిసరిగాను నీకా శ్రీపాదు విదు
గఁగ్రాలుని నని చెప్పినట్లున్నది.

విశ్వా—రాజా! తడవైన దిఁక మేము పోవలెను.

పుష—(నమస్కరించి)
గీ. ఎనఘకీర్తి నీభువి ♦ నొక్కి నడిచెనొ
వాఁడె మీపాదములమీఁదఁ ♦ బడినవాఁడు
సూర్యసామ్య స్వర్లోకపాలన ♦ సుస్థిరాను
నింద్రుఁ డొసఁగు రాజ్యాన ♦ కౌఁగిలించు.

విశ్వా—నీకు భద్రమగుఁగాక (అని నిష్క్రమించుచున్నాఁడు.)

విదూ—మహారాజా! ఒక్క సందేహము గలిగినది ఒక్క భూలోకభా
రమే మీమీఁద నుండఁగా ముల్లోకముల భారముకల యింద్రుని
తోఁ బోల్చుకొంటిరేమి! అధోలోకమునకుఁ బోవుభార మొక
టియుఁ దరువాత స్వర్గలోకమునకుఁ బోవుభార మొకటియుఁ
గలియుటచేత నటు లంటి రని నే ననుకొంటిని. సాలెపురుగు పై
కెగరఁబోయి కాలూఁత జారి గోడమీఁదనుంచి బల్లి క్రిందపడి

నట్లు నీ జీవనమృగమును జంపునాశచే నధోలోకమునకు పాలు గావలసివచ్చెనుగదా.

పురు—ఛీ! మిత్రమా! ఇక్ష్వాకుకులసంభవులను సంధించినబాణ ముపసంహరించుట మర్యాదకాదని హృదయమునాట నీ వనుమాటచేత సందిగ్ధమానసుండ నయ్యును బాణమును వదలితిని. కాని నేను బుద్ధిపూర్వకముగా విడిచియుంటినా!

విదూ—చాలుచాలు! మహారాజా! తనయౌషధములచే బ్రతికినఁ దన ప్రయోజకత్వ మనియుఁ జచ్చిన రోగియొక్క నిర్భాగ్యత యనియుఁ బలుకునట్టి వైద్యునివలె కార్య మనుకూలించిన తనప్రయోజకత్వమును చెడిపోయిన నవకరులయప్రయోజకత్వ మనియు సహజముగ రాజు లిట్టి యెడల నీతులనే పుట్టెనా! ఇట్టిచీవాట్లు తినుమని బ్రహ్మ నాతలనే వ్రాసెనా?

పురు—(విదూషకుని చేయిఁబట్టుకొని) నీవు నాసఖుఁడవు కాని, సేవకుఁడవు కావుసుమా!

విదూ—ఆహాహా! (అని నవ్వుచున్నాఁడు)

పురు—(నవ్వుచు) అయినను కోపదీపితుఁడైన యామునిసింహము నిటు కాకర్షించుటకు నీవే ప్రథమకారణమవు.

ఆ. నీదుమాట వించు ♦ నేఁ జేయుపనిచేత
నాకు శాప మయ్యె ♦ నీకు లేదు
వటువు గూనెనంచు ♦ వాపోవుకరి మృగ
నాథుబారిఁ బడును ♦ నక్క కేమి?

విదూ—ఆహా! మిత్రమా! నాకు మునివలన శాపము లేదని విచారించుచుంటివా! కొంపఁ గాల్చుటకు కొఱకచ్చునిప్పైన నేమి, పిడకనిప్పైన నేమి. తిట్లు తినుటకు నీవలననైన నేమి, మునివలననైన నేమి. నీవలన నిప్పుడే యాయవశిష్టముగూడఁ దీఱినదికదా.

అంశు—మిత్రమా! రాజుస్వభావమును బరిశీలించితివిక దా!

ఆ. తానుశాపత ప్తుఁ ♦ డైనను చిన్నిపూ
దేనెపలుకుగమిని ♦ దేర్చు సఖుని
పొంతవాని కమృత ♦ పూరాభరస మిచ్చు
గానుగందుఁ జెఱకు ♦ కట్టకరణి.

పురు—నీకు శాపము లేకపోయినదని నావిచారము కాదుసుమా!

ఆ. గొప్పకష్ట మెంతొ ♦ గొప్పవానికిఁగాని
బహుగులకును సంభ ♦ వంబు గాదు
పిడుగు గోపురముసఁ ♦ బడుగాని బాలల
పిచుకగూటబడున ♦ పేర్మిసఖుఁడ!

అంతయె నాయభిప్రాయము. నీ వన్యథా తలఁచితివి.

అంశు—మిత్రమా! నా కొక్క యాలోచనతోఁచుచున్నది. శంఖము నఁ బోసినఁగాని తీర్థము గా,,దనురీతిని నీచెవినిఁ బడినఁగాని యా ది పూజ్యమైనదిగాదుసుమా.

చిత్ర—ఏదియో చెప్పుము.

అంశు—ఏదనఁగా రాజేనో మాటలాడఁదనున్నాను. అదిముందువిం దము.

పురు—గీ. విమలమును బ్రభావంతంబు ♦ విగతదోష
మైననాచిత్తమందు న ♦ వీనముగను
కలుషదుఃఖ మీాపట్లను ♦ గలిగెఁగాదె
పద్మహితునకు రాహుసం ♦ స్పర్శమట్లు.

విదూ—పులుగుల్వ్రాలినగృహమును శీఘ్రముగ విడిచిపెట్టవలసినరీతిని విశ్వామిత్రుఁడు వచ్చిపోయినయీతావును శీఘ్రముగ విడిచిపె ట్టఁదగును.

పురు—మిత్రమా! ఇంతకంటె నేమియూపద రాఁగలదు?

అంశు—మిత్రమా! నేచెప్పఁబోవున దేదనఁగా నిప్పుడే నరకలోకమున నీరాజును గొనిపోయి నర్మదోద్యానవనమందు చలువరాతిన్నపై నితనిఁబరుండఁబెట్టెదను. నర్మదాపురుకుత్సు లన్యోన్యవీక్షణమున మోహావిష్టులై దంపతు లగుదురు గాక.

చిత్ర—తథాస్తు. అటులైన విశ్వామిత్రునిశాప మిప్పుడే ఫలింపనున్నది కాఁబోలును. మోహనవిద్య నీవు నేర్చినదొకటుఁ బ్రస్తుతావమున నీరాజునకును విదూషకునకును నిద్దుర గల్పించి రాజును మాత్రము తీసికొనిపోదము.

విదూ—ఈశాపమం దెక్కువపటుత్వము కనఁబడదు. మిత్రమా! విశేషదుఃఖకారణమనియును దోఁచుట లేదు.

పురు—ఎందుచేత?

విదూ—అత్యంత సౌందర్యవతి యగుభార్యతోఁ బదునాలుగు సుఖ మనుభవించి యాపిమ్మట తేజఁ డగుకుమారునిఁ గాంచెద నని యీను హాని పలికెనుగదా. ఇవియన్నియు సుఖముఁ గలుఁగుటయే యను చింత చేఁ దపించుచున్ననీ కీశాపము వరమే యయినదో సంతోషించుటకు బదులు సంతపించుచుంటి వేల?

పురు—ఓయి వెట్టివాఁడా!

గీ. నాకథోలోకగతి యుండ ♦ నాదు వేల?
పుత్రు లేల? ధనం బేల? ♦ బొంది యేల?
సద్విలోఁ బడి మునిఁగెడు ♦ నతనిచుట్టు
కెంపు లేల? వజ్రములు మా ♦ క్తికము లేల?

విదూ—రాజా! విచారింపకుము! అదృష్టదేవత గయ్యాళిపెండ్లామువలె నొకప్పు డొకచెంప గట్టిగ ముద్దు పెట్టుకొనును. మఱియొకప్పుడు చెంప విరుగఁ గొట్టును. ముద్దునకుఁ జెంప నిచ్చి దెబ్బకుఁ జెంప నీయకుండఁగలమా! ఈయక పోయిన నష్టమైనను

గొప్పక పూనడు. లెమ్ము రాజాపోవుదము. (అని రాజును లే వదీయుచున్నాడు.)

చిత్ర—మోహనవిద్యను బ్రయోగించితివా?

అంస—ఇదిగో ప్రయోగించితిని.

పురు—(కొంచెముదూరము నడచి) మిత్రమా! నాకుఁ గన్నులు దిరుగుచున్నవి. ఒక్క త్రుటికాల మిచటఁ గూర్చుండెదను.

విదూ—మంచిది (అని యిద్దఱును గూర్చున్నారు.)

పురు—

గీ. పరిసరిగఁదోఁచుతెప్పలఁ ♦ జుక్కలను మాపెఁ
దల మిగుల బరువగు చుంగ ♦ దములు దూలె!
నడుకులేనట్టియూహలు ♦ మదినిఁ గ్రమ్మె
నిదుర వచ్చెడు నని తోఁచు ♦ నేస్తకాఁడ.

విదూ—సరావాసదోషము చేతఁ గాబోలును, నాకు నట్లేయున్నది.

పురు—అట్లైనఁ గొంత సేపు విశ్రమింతము.

విదూ—అవశ్యమట్లే. నీవు గురుకపెట్టెదువు కాన దూరముగఁ బరుండుము. (అని యిద్దఱును నిద్దురపోవుచున్నారు)

చిత్ర—(సారిని సమీపించి) ఉచ్చునఁబడినకొండ్రముచ్చువలె నీబ్రాహ్మణుఁ డొట్లుముడుచుకొని పరుండెనో చూడుము.

అంస—ఓరాజా! క్షమింపుము.

ఆ. హంసతూలతల్ప ♦ మందు నిద్రించు నీ
మొరకు నేల నిద్ర ♦ బుచ్చినాఁడఁ
బాలపాన్పుపైనఁ ♦ బూబోఁడితో నిన్నుఁ
జేర్చి వేగ లోటు ♦ దీర్చుకొందు.

మిత్రమా! ఇఁక రాజు నెత్తికొని యురగలోకమునకుఁ బోవ సెలవిచ్చెదవా? (అని రాజు నెత్తికొనుచున్నాఁడు.)

చిత్ర—ఆ. భూభరంబుమోయు ♦ పురుకుత్సునీతని
నొక్కచేత నెత్తి ♦ యుంటి వీవు
భూమిమోయు శేషుఁ ♦ బోలుసారఁ గరకం
ణముగఁ జేయుభూత ♦ నాథుకరణి.

ఇప్పుడు నీబాహుబంధమందుఁ జిక్కనయీమహారాజు నర్మదా బాహుబంధమందు ముందు స్థిరముగఁ జిక్కుఁగాఁక.

ఆ. స్నేహబంధమునకు ♦ నేనిప్పు వేత్వేఱు
తుదల మైత్రి మీఁవు ♦ బోదలుబస్వ
తోడఁ గ్రింద కేగఁ ♦ దోడనేపైఁబోదు
నేచి నీరుఁదోడు ♦ నేతమువలె.

విప్రవర్యా! లెమ్ములెమ్ము (అనియిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

విదూ.—(లేచి)ఓహో! యెవ్వరో పిలుచుచున్న ట్లున్నవారు (కన్నులు నులుపుకొనుచు) రాజా! ఇంటికి పోవుదము లెమ్ము. (కన్నులు తెరచి) ఏమీ! రాజు లేఁడయ్యెను! అయ్యో! యేమైపోయెనో కదా! నేనే యిదివఱకు సజీవుఁడనై యుండఁగ రాజున కేమిభయము కలిగియుండును? వేఁటతోఁగూడ వచ్చినభటులందఱును రాజును లేపి తీసికొనిపోయి యుందురు కాఁబోలును. రాజు నను మఱచి యేగియుండవచ్చును. అయ్యో! ఈ యరణ్యరోదన మెందులకు? ఇంటికిఁ బోయి సావకాశముగ నేణ్చిన మంచిది. (అని నిష్క్రమించుచున్నాఁడు)

ప్రథమాంకముసంపూర్ణము.

---

శ్రీ

# నర్మదాపురుకుత్సీయము.

## ద్వితీయాంకము.

రంగము—ఉరగలోకము నర్మదోద్యానవనము.

[నర్మదయును చేటిక నవమాలికయుఁ బ్రవేశించుచున్నారు.]

(ఒకమూల చలువరాతిన్నెపై పురుకుత్సుఁడు నిద్రించుచున్నాడు.)

(నర్మదయు నవమాలికయుఁ బూలచెట్లకు నీరుఁబోయుచున్నారు.)

నవ—నర్మదా! ఈపూలచెట్లు మిక్కిలి యదృష్టమును చేసికొనినవి సుమా!

నర్మ—ఎందుచేత?

నవ—మహారాజ పుత్త్రికవైన నీవలన సేవఁ గొనుటచేత.

నర్మ—పూలచెట్లు చక్రవర్తి చేతనైనను సేవఁగొనఁదగినవే కదా!

నవ—పుష్పవతి యగుకొమ్మను నీవుమాత్రము సేవ నొందుటకపేక్షించ గూడదు!

నర్మ—నీవు సేవఁజేయుచు నుంటివే కదా!

నవ—నాసేవ కేమిలెమ్ము; నీకుఁ బతిచేయవలసిన సేవమాట జెప్పితిని.

నర్మ—(నవ్వుచు) స్వచ్ఛమై లావణ్యవంతమై యొంటరియై యున్నయీ కుందుమల్లియపూవు నీకంటికి శోభగ నున్నదా? లేక ముండ్లపొద పైఁ బ్రాకినయీచంపకలత శోభావంతముగ నున్నదా?

నవ—ఆహాహా! నర్మదా! విశేషకళావంతుఁడై నీహృదయమును సంపూర్ణముగ రమింపఁజేయఁదగినవాఁడు లభించునెడల వివాహోద్దేశమునే మాని యేకాంతముగనే యుంటివిగదా, స్వచ్ఛమగు నీ కాలము గడుపుచుంటివా!

నర్మ—కానేమి? రమణ, చంద్రునివంటివానికై నిరీక్షించుట యుచితమే కదా!

నవ—నీచంద్రికగారినిమాత్రమువలనవచ్చిన నా చంద్రునిఁజూపనుందునని—

నర్మ—శుక్రకాంతిచేఁ గలుగ భాసింపుమా?

నవ—(నవ్వుచు) లోకలోకములన్నియు లంకెలు సేయాలవే యయిరా!

నర్మ—సఖీ! వారినిగూర్చి యేల నసుగొందువా?

నవ—ఆత్మస్తుతి చేసుకొనుచుంటివా?

నర్మ—నేను బంగారమువంటిదాననైనను మణినే యపేక్షింతును. తృణమువంటిదాననైనను మణినే నాపేక్షింపను. భగవంతుఁడు నాకనులం దుంచినయట్టియున్నతోన్నత స్వభావమును వెల్లడించుచుంటినే కాని వేఱుగాదుసుమా!

నవ—భూలోకమున సుందరరాజేంద్రు లెవరైన నుందురా?

నర్మ—చూచి చెప్పవలసినదికదా!

నవ—భగవంతుఁడనుగ్రహించినయెడల శీఘ్రముగా జూతుమేమొ!

నర్మ—ఆదృష్టినే యుంటచేత నిద్రబోవుచుండఁగ జూతుమేమొ!

నవ—ఆహాహా (అనినవ్వుచు) కలలోనా? నర్మదా! ఈదినము నీమోమొకవిలక్షణకాంతిచే శోభించుచున్నదిసుమా!

నర్మ—నీకన్నులు మాఱియుండవచ్చును.

నవ—అట్లైనచో దృష్టిభేద మన్నివస్తులయందుఁగూడఁ బరిణమించవలసినదికదా—ఒక్కనీమోమునందుమాత్రమే యపూర్వశోభ భాసించుచున్నదిసుమా!

నర్మ—ఎట్లు!

నవ—కంటిని ప్రమాదవశముచే నులుముకొనిన ప్రేలితోఁ జెక్కు నంటుటచేతఁ గాఁబోలును! చెక్కుపై స్వల్ప కాటుక చుక్కయు, చెమటచేఁ గాఁబోలును! కొంచెము జారి యుపపాయమైన బొట్టును సంపెంగపూలగుత్తియొద్ద నుండుటచేఁ బసుపు రాచినట్లు గనఁబడుచున్న నీమోమును, జాజిపూఁబొదరింటఁ దూరుటచే నాలత నీతలపై రాల్చిన కుసుమములనుజూడ నీమో మింతంతనరాని కాంతిచేఁ బ్రకాశించుటయేకాక శీఘ్రముగ నీకు వివాహ మగునని కూడ సూచించుచున్నది.

నర్మ—(సవ్రీడము) ఓసి వెఱ్ఱిదానా అభిమానమువలన నట్టివింతలు నీకు కనఁబడుచున్నవి.

నవ—సఖీ, నర్మదా! ఈవింత చేసె దపటు చూడుము. ఐరావతముపై రత్నఖచితమగుగంధపు టిట్టిస్తరు చలువరాలెన్నపై నేదియో కన్పట్టుచున్నది చూడుము.

నర్మ—నవమాలికా! అపురుసుమా! అది యేదియో చూచి పేగ రమ్ము.

నవ—సఖీ! ఇస్వరమును పోవుదము.

నర్మ—న కేడముతోడ మిక్కిలి యదురుటచే నడువఁ గొంకుచున్నాను. నీవే పొమ్ము.

నవ—(అక్కడికి పోయి యాశ్చర్యముగఁ జూచుచున్నది.)

నర్మ—(తనలో) మహాసుందరపురుషుఁడును, అమూల్యమణిగణ ఖచిత భూషణుండును, మహారాజలక్షణలక్షితుండు నగు నొకమహానుభావుఁడు నిన్నరాత్రి నాకు స్వప్నమున సాక్షాత్కరించి వడఁకెడు నాకరమును దనకరమునఁ బట్టి ‘‘ఈమణికొఱకే సుమా యీలోకమునకు వచ్చితి,, నని చెప్ప తంబురతీఁగ నొకకొస

మీాట ధ్వనియుఁ గంపమును తీఁగయంతయు వ్యాపించునటుల మొదలాపాదమస్తకము ఝల్లుఝల్లుమన నల్లనకన్నులు విచ్చితిని. శుభస్వప్న మైనవెంటనే రానియ్యఁగూడనినిదుర తనయంతఁ దాన మాయ మాయెను. హృదయమా! అట్టిమహాపురుషు నెన్నఁడైనఁజూచి—

నవ—(సంభ్రమముతో వచ్చి) సఖీ! నర్మదా! నర్మదా! సఖీ!

నర్మ—ఏమీా! అంతసంభ్రమమునకుఁ గారణ మేమి!

నవ—ఎండదగిలిన మృగరాజము చలువకొఱకు చెట్టునీడనున్న పాలరాతిపలకపైఁ బరుండి నిదురబోవునట్లెవరో కిరీటాంగదభూషణుఁడగునొకమహాతేజశ్శాలి యాచంద్రకాంతశిలావేదికపైఁ బరుండి నిదురించుచున్నాఁడు.

నర్మ—చాలు !చాలు! సఖీ! నీమాటలను నేను నమ్మను.

నవ—సఖీ!పరిహాసముగాదు.యథార్థమే చెప్పుచుంటినిచూతువుగానిరమ్ము.

నర్మ—(తనలో) దీనివైఖరి చూడఁగ యథార్థము చెప్పుచున్నట్లు తోఁచుచున్నది. అసత్యవార్తనుగురించి సాక్ష్యమిచ్చెడునప్రామాణికుల పరస్పరాసందర్భవాక్యములవలెఁ గాక దీనినోట వెడలు మాటలను కనులసంభ్రమము, చెక్కులవిలక్షణకాంతియు సందర్భముగ స్థిరపఱుచుచున్నవి. కావున,

నవ—సఖీ! యొందులకీయాలోచన? పోయియుండినయెడల నీసరికిఁ జూచి తిరిగి వచ్చియుందుము.

నర్మ—అటులైన పోదము రమ్ము (ఇద్దఱును రాజునొద్దకుఁబోయి నిలువఁబడి యాశ్చర్యముతోఁజూడసాగిరి)

[అంశుమంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

అంశు—ఆమహారాజుపైఁ బ్రవేశపెట్టినమోహనవిద్య నుపసంహరించుట మఱచియే వెళ్లితిని. ఈసరికి నర్మద యాతనిని చూచినదో

లేదోకదా! (అటునిటు పరిశీలించి) ఆహా మంచిసమయమునకు వచ్చితిని. తిరస్కరిణిచే నిచట ప్రచ్ఛన్నుఁడనై యీచిత్రమును జూచెదను.

గీ. పరమలావణ్యయుతగాత్ర ♦ వల్లియురగ
రాజపుత్త్రిక యీమహా ♦ రాజుదాపుఁ
జేరనది యల్లదేనూన ♦ వారభార
సారమాలతి సురపొన్నఁ ♦ జేరులీల.

నవ—సఖి! నాపలుకులు బూటకము లంటివే.

నర్మ—(నవమాలికయొక్క నోరు మూసి) నిమ్మళముగమాటలాడుము (నిట్టూర్పువిడిచి) ఇష్టమైనను నాకన్నులను నేను నమ్మలేకున్న దానను.

నవ—(నవ్వుచు) నీచేతితో స్పృశించిన యథార్థమని నమ్మెదు వేమో.

నర్మ—(తనలో) నిన్నను స్వప్నావస్థయందుఁ జూచినపురుషుఁడు వీని వలెనున్నాఁడు. ఇదినాకు తిరిగి స్వప్నావస్థయేమో! (ప్రకాశముగా) నవమాలికా! నేను నిదురబోవుచుంటినా! మేల్కొంచియే యుంటినా?

అంశు—ఆహా! మదనవికార మారంభమైనది.

నవ—"నిదురబోవుచుంటినా మేల్కొంచియుంటినా" అనినన్నడుగుచుంటివా! అడిగినవా రెవరో యదిరైన నెఱుగుదువా!

నర్మ—(కోపముతో) ఏమి, అంతపరిహాసము.

నవ—నిదురబోవుచున్నరాజును జూచినమాత్రముననే వానితోనైక్య మగుటచేత నీవును వానివలెనే నిదురబోవుచున్నట్లు భ్రమసితివా!

నర్మ—నీవు నన్ను కలఁత పెట్టుచుంటివిసుమా.

నవ—ఈమహారాజు నిన్నుకలఁతపెట్టుచుండ నన్ను నేద వేల?

నర్మ—సఖీ! మోహమునందలి యీవిష్ణుశాయిగూడ నొకశృంగారముగ నున్నది.

ఆంశు—ఇది స్వభావమే.

ఆ. విభునిలోటు లెట్టిదైన ♦ వేయి శృంగారంబు
లగుట నిజము సుదతి ♦ యాకేళులును
బలికె లోనగియున్నఁ ♦ బలుగాజకలికితోఁ
జూచు బెట్ట రత్న ♦ శోభ గనదె.

నవ—సఖీ! నీవు పీఠపాదసాన్నిధ్యమందుఁ గూర్చుండుము. గాఢముగ నిద్రబోవుచున్నాఁడు.

నర్మ—నీవుఁ గూర్చుండినచో నేనుగూడఁ గూర్చుండెదను.

నవ—[నవ్వుచు] అలాగా? సరే (అని యిద్దఱు వాని పాదములయొద్దఁ గూర్చుండిరి.)

నర్మ—[తనలో] ఈమహారాజనందనుఁ గూర్చుండి పరమానంద మిప్పుడొందుచుంటినికదా. అతఁడు మేల్కాంచినవెనుక నన్నంగీకరించునో తిరస్కరించునో?

నవ—సఖీ! నీ వేమి యాలోచించుచున్నావు?

నర్మ—నీ వేమో వ్రాయుచున్నట్లున్న దది యేమి?

నవ—మఱేమియు లేదు. నిన్నే వ్రాయుచుంటిని. నీవలన నేర్చినవిద్యయే కదా.

నర్మ—నన్నేల వ్రాయుచుంటివి?

నవ—విశేషమేమియు లేదు. సఖీ! నర్మదా! ఈమహారాజచంద్ర కాంతవేదికపైఁ బరుండి శేషశయనుఁడగు శ్రీమహావిష్ణువువలెఁ బ్రకాశించుచున్నాఁడు. మన యిద్దఱము—

నర్మ—(కోపముతో) ఛీ! యేమనఁబోవుచుంటివి?

నవ—(అక్కడనుండి లేచి యావలకు వచ్చి) నేను భూదేవివలె నుంటి

ననినే ననిపోవుదు ననికదాసీకింతయహంకారముకలిగినది. వరుఁడు నీకింకను లభ్యుఁడు కాకయుండెను; నేననఁదలఁచినమాట నీవుపూర్ణముగ వినకయేపోయితివి. ఎందులకే నీ కింతయసూయ! కానిమ్ము. కైలాసగతుఁ డగుశంకరుని యర్ధాంగలక్ష్మి యగుదుర్గామహాదేవివలె నీ వుంటివన్న నీకు సంతోషమేనా?

అంశు—శబాస్ నవమాలికా?

నర్మ—(దిగుచు) ఛీ! సఖీ? న న్నెత్తిపొడుపుమాటలాడెదవా?

అంశు—

ఆ. అతివలందు బురుషు ♦ లందు హేతువు లేక
యే యసూయఁ జెంది ♦ యెప్పు డులుకు
నాఁడువారిచిత్త ♦ మలరారు గాలియే
లేక కదలురావి ♦ యాకుభంగి.

తడవైన దింక రాజుపైఁ బ్రవేశపెట్టినమోహనవిద్య నుపసంహరించెదను.

నవ—[రాజును సమీపించి తాను వ్రాసినచిత్రపటమును రాజుప్రక్కను పెట్టుచున్నది.]

నర్మ—నాపటము నారాజుప్రక్క నెందుల కుంచితివి?

నవ—నీరాజుకనుకనే యుంచితిని. ప్రక్క నెందుల కుంచితి నని యాక్షేపించుచుంటివా? పోనిమ్ము. భావిపుంభావసూచనగాఁ బైన నే పెట్టెదనులెమ్ము.

[అని నిమ్మళముగాఁ దీసి యతనివక్షముమీఁదఁ బెట్టుచున్నది.]

నర్మ—ఛీ! ఏమిపని జేసితివి! [అనిరాజునొద్దకు పోయి యాపటము నాతనివక్షమునుండి లాగుకొనఁబోవునెపమున నతని బాగుగ స్పృశించుచున్నది. చిత్రఫలక మచ్చటనే పారవేయుచున్నది ]

[అంతలో రాజు మేల్కాంచుచున్నాఁడు.]

[అంతట నర్మదానవమాలికలు శీఘ్రముగఁ బరుగెత్తి పూలచెట్లవెనుక దాఁగిరి.]

నవ—ఎంతగడుసుదానవు. రాజును స్పృశించుటకుఁ జిత్రఫలకము దీసికొనువంక దొరకినదా?

నర్మ—(తర్జనితో బెదరించుచున్నది)

పురు—[లేచి కన్నులు మూసికొని] ఓ హేగాధినందనా!

ఆ. వెనుక నిద్ర లేచు ♦ వెంటనే ,,శివశివా,,
యంచుఁ దలఁతు నిప్పు ♦ డంతు ,,గాధి
నందన,, యని చిత్త ♦ మందు ముందుగ నుంచుఁ
బెట్టువానికంటెఁ ♦ దిట్టువాఁడె.

అంశు—ఆ. పరమభాగ్యకలిత ♦ పురుషుల కిలలోనఁ
దిట్టు దీవనగుట ♦ వట్టిమాట
కాదు చేతఁ బరసు ♦ వేది కర్గెడువాని
కవని మట్టి బంగ ♦ రైనరీతి.

నీవు మహాదృష్టవంతుఁడవు రాజా!

పురు—(కన్నులువిచ్చి;)ఏమీ యిష్టసఖుఁడుగూడ లేఁడయ్యె నేమయ్యెనో కదా? (అటునిటు కలయఁ జూచి)-ఈస్థల మంతయునుక్రొత్తగనున్నదే! నే నిదిముం దెన్నఁడును జూచి యుండను. విశ్వామిత్రుని యాశ్రమమున మొదట నిద్రించితిని. ఇచ్చట మేల్కాంచితిని. ఇది యాయాశ్రమము గాదనుట స్పష్టము.

సీ. పెంపుడుపక్షుల ♦ ప్రియవాక్యములె కాని,
కొంటెశిష్యులవేద ♦ ఘోష మిల్ల ?
లలితదోహదవాస ♦ నలు గుభుల్కొను గాని,
హోమాగ్నిపరిమళ ♦ మేమి లేదు

పడంతులు కొప్పున ♦ ముడుచుపుష్పాలె గాని,
పుంజ కుత్తుకములౌ ♦ పూలు కొలంది
వటీసౌభాగ్యతనుకుటీ ♦ రములగిములె గాని,
గూఢసామర్థ్యగర్వ ♦ గుహాలు లేవు.

గీ. గాన పుణ్యాశ్రమం బిది ♦ కాదు నిజము
కనకనారంభ రంభావన ♦ వివర్తితైన
స్త్రీలయుద్యానవన మిది ♦ నేరయుం గాదె
పైటకొంగేదొ కాషాయ ♦ శాటి యేదొ!

నవ—మహానుభావా! బాగుగఁ గనిపెట్టితిరి.

నర్మ—సఖీ! ఆపురుషుఁ డింతసంభ్రమముఁ బడుచుండె నేమి చెప్పుదమూ! ఇప్పటివఱకు కామమహానుభావుని చర్య యగ్రాహ్యమై యున్నది.
(తనలో) హృదయమా! ధైర్యము వలంబించుము.

పురు—ఇది యామహాపురునియాశ్రమమే కానియెడల నే నిట్టి కొక్కడ నుంటిని? ఆహా! యింకను నిద్రబోవుచుంటి నేమో (కన్నులం దుడుచుకొని) ఏమీ ప్రత్యక్షముగా జాగ్రదవస్థలోనే యుంటిని కదా.

గీ. కనులు గాంచెడుఁ, గర్ణముల్ ♦ వినెడు నిచటి
కలితషట్పదకలకంఠ ♦ కలరవముల,
మంచి దిదియంచుఁ గాదంచు ♦ మనసు నిశ్చ
యించు, నిదురించు నే నెటు ♦ లెంచువాఁడ.

ఒకవేళ—

గీ. గాటమగుకలఁ గని మేలు ♦ గాంచునరుఁడు
స్వప్నవస్తువులనె చూచు ♦ సరణి నుండు
వనమునను బాముఁ గని యుంటి ♦ నెనయువిరిక
యేద్రిప్రాఁకిన పాముగా ♦ నెంచునీతి.

పురు—ఛీ! మూఢా! పురుకుత్సా! ఇదిభూలోకము గాదని భ్రమించు చుంటి వేమిరా!

ఆ. నాదుబాహుపీఠి ♦ నేదయ లాలించు
భూమి నేను వేఱు ♦ బొంద నగునె?
నేను బ్రతికియుండ; ♦ సూనంబుఁ జెడకుండ
దానిపరిమళంబు ♦ దలఁగునొక్కొ?

అంశు—ఓహో! మహారాజా!

ఆ. తప్పితప్పి తుదకు ♦ నొప్పు గాంచఁగఁబోయి
తిరిగి మోసపోయి ♦ తివి తరంగ
మొకటి వచ్చి తీర ♦ మొందింప వేఁకొంట
వనధిఁ ద్రోయఁబడిన ♦ మనుజాకరణి.

నవ—సఖీ! ఇతఁడు భూమినిఁబాలించుపురుకుత్సరాజేంద్రుఁ డని వింటి మి. నీ వదృష్టవంతురాలవు.

నర్మ—(తనలో) హృదయమా! శాంతి నొందుము.

పురు—అయ్యో! ఇది భూలోక మని తోఁచకున్నది ఇఁక మఱి యేమై యుండునో కదా! నేను పురుకుత్సుఁడ నేకదా?

(తలపంకించి కిరీటమును జేతఁ బట్టుకొని)

ఆ. మహితతేజుఁడైన ♦ మాంధాత మాతండ్రి
బెట్టుదీని నేనె ♦ పెట్టఁ దగుదు
హరునిచేఁ ద్రిశూల ♦ మలకుమారస్వామి
పట్టఁగాని యెవఁడు ♦ పట్టఁగలఁడు?

ఆహా! ఏమియుఁ దోఁచకున్నది చిత్తమా!

ఆ. కానియూహ లెన్నొ ♦ కావించి నిజమును
దెలియలేక సొమ్మ ♦ సిలితి వీవు
గడినిమూయఁబడిన ♦ కలకంఠ మిటునటు
నెగిరి యెచ్చి సీర ♦ సించుగలిని.

ఓహో! విశ్వామిత్రా! నీకధోగతియగునంటివిదేనా?

అంశు—సత్యము, సత్యము, ఇదే.

నర్మ—(తనలో) అయ్యో! విశ్వామిత్రునివలన నధోగతిపా లగు మని శాప మియ్యఁబడితివా! శాపమున్న సరే! మఱి యేదోషము న్న సరే! నిన్నే నేను వరింతును.

పురు—గీ. ఇంతకంటె నధోగతి ♦ యేది గల్గు
నేడనుంటిని? యెవఁడను? ♦ యేదిస్థితియొ?
మెఱుఁగ కీరితిఁ గేకల ♦ నిడుచునుంటి
సంధియొత్తి నజ్ఞాతుని ♦ చందమునను.

ఆహా! పరమేశ్వరుఁడా! ఎట్టియవస్థ తటస్థింపఁజేసితివి! కానిమ్ము; పురుకుత్సుఁ డధైర్యపడువాఁడా! ఈధనువు చేతనుండఁ బురుకుత్సు నెదురాఁగువా రెవరు! (అని లేచుచున్నాఁడు.)

అంశు—ఓయి వెఱ్ఱిరాజా! నీధనువు నిన్ను గాచు ననుకొంటివా?

ఆ. తుంటవింటిఁ దూఁపు ♦ నంటించి చలముతో
నిన్ను వ్రేయఁ గంతుఁ ♦ డున్నవాఁడు
ధనువు వదలి యదిగో ♦ తరళాక్షికన్బొమ
వింటిప్రాపుఁ గాంచి ♦ విజయి వగుము.

పురు—ఎచ్చటికిఁబోదును! ఇచ్చటస్థితిగతులు తెలియుట కేమియు నా ధారము లేదయ్యెను.

ఆ. నేను పలుకుమాట ♦ నేనె యాకర్ణింప
వలయుఁగాని వినెడు ♦ వాఁడు లేఁడు
తనప్రతిధ్వనులను ♦ తానె వించును గుహ
బొబ్బరించుసింహ ♦ పోతమట్లు.

నర్మ—(తనలో) వినెడువారే కాక విని నీయిష్టానుసారమే ప్రత్యుత్తర మిచ్చువారునుగూడ నిక్కడ నున్నారు. ఇటు రమ్ము.

పురు—(అటునిటు నడచి) ఏమిది? భూర్జపత్రమా! (సంభ్రమముతో దీ
సికొని)

గీ. మణులనైనను కాలితోఁ ♦ జెనకువాఁడ
దీని సంభ్రమంబునఁ దీసి ♦ తిని విశేష
మలజడినిబొందు నాయున్కి ♦ తెలియ నేట
మునుఁగువాఁడు తృణంబైనఁ ♦ గొనినకరణి.

(చిత్రఫలకమువంక దేరిపార చూచుచున్నాఁడు)

నవ—సఖీ! నీవిగ్రహమును భుజపత్రమందు చూచుచున్నాఁడు. ఇఁక
నీవు గెలిచితివి.

నర్మ—సఖీ! నిజముగా నాచక్రవర్తి నాకు లభించకుండినయెడల నేను
జీవించెదనా?

పురు—(పటమును జూచి మందహాసమును జేయుచున్నాఁడు.)

నవ—నర్మదా! నీరూపమును జూచి రాజు మందహాసము జేయుచు
న్నాఁడు.

నర్మ—అయ్యో! సౌందర్యవతిని కానని నవ్వుచున్నాఁడేమో! నీవు
యధార్థరూపమునే లిఖించితివా! లేక యసందర్భముల నేమైన
వ్రాసితివా?

నవ—సఖీ! రాజేమో మాట లాడఁబోవు చున్నాఁడు.

నర్మ—అయ్యో, ఏమనునో కదా!

పురు—(పటమువంకఁ జూచి) ఆహా!

గీ. కన్ను లుండినఫల మది ♦ గాంచినాఁడ
నోరు నెవ్వంగ స్తుతి సేయ ♦ నోఁచినాఁడ
పులక లెత్తంగఁ గౌఁగిటఁ ♦ బొదువువాఁడ
ప్రతిమ! నాచింతఁ బాపఁగ ♦ వచ్చినావు.

నవ—సఖి వింటివా! ఇఁక నీయవశిష్టమేకదా.

నర్మ—ప్రతిమకు నీవు నానైజసౌందర్యముకంటె నెక్కువ గలిగించ లేదుకదా.

నవ—ఎక్కువ గలిగించుట కవకాశ మేది?

పురు—ఓహో! ఈకాంత నా కెట్లు లభించునో! దీని నెనయకుండిన యెడల నే నెట్లు బ్రతుకువాఁడ.

గీ. పద్మపత్త్రాక్షి, వికసిత ♦ పద్మవదన
దీనిఁ గూడక నే నుంటి ♦ నేని నాదు
జీవనము నిందనీయమై ♦ పోవుఁ గాదె
పద్మలత లేనికొలనిజీ ♦ వనముభంగి.

నవ—గంభీరమైనగర్జలతోఁ గూడినమేఘమునుండి జారినస్వచ్ఛోదకబిందువులను వానకోయిల గ్రోలునట్లు వీని రసవంతంబు లగుగభీర వాక్యములను జెవులారఁ గ్రోలి నీచిత్తతాప మార్పుకొనుము.

నర్మ—నాకొల కామహారాజింత పరితాపపడుచున్నాఁడని నేను వ్యసనము నొందు చుంటిని.

అంశు—రాజా! మునివాక్యఘాతము విశేషమా? కుసుమకోదండ నిర్ఘాతసాయక ఘాతము విశేషమా!

పురు—గీ. తిట్టె ముని యంచు గిజగిజ ♦ కొట్టుకొనఁగ
నట్టె పైఁబెట్టునను పూవు ♦ టమ్ము బెట్టి
కొట్టె సుమసాయకుఁడు దయ ♦ కట్టిపెట్టి
కలుగుకంటిని వ్రేలితోఁ ♦ గలఁచినట్లు.

ఆ. కాంతచింత నాకు ♦ గడువిశేషంబైన
కారణమున వెనుక ♦ గల్గుచింత
వేగ నడఁగిపోయెఁ ♦ బెద్దదీపము చిన్న
దీపమునకుఁ గ్రింద ♦ దాపినట్లు.

ఓహో! చిత్తమా!

ఆ. ప్రతిమఁ జూడ నిట్టు ♦ లతిసంభ్రమము బొందు
నీవు కాంతఁ జూడ ♦ నిలువఁగలవె?
కలను ధనపుఁబాతుఁ ♦ గాంచి పొంగెడు పేద
దృష్టనిధినిఁ బొందు ♦ రీతిగాఁగ.

ఏమైనను సరే. దానిని వెదకి చూచెదను [అటునిటు నడచి]

సీ. సుమములార! శ్రీచందన ♦ ద్రుమములార!
వల్లులార! సారంగీమ ♦ తల్లులార!
ప్రసవహాస, చందనగంధి, ♦ రమ్యగాత్ర
వల్లి, గజయాన, జూపుఁడీ ♦ పరమదయను.

ఓహో! ఈయరణ్యమును జూడ సత్యద్భుతరామణీయకఖని యైయున్నది. ఇంత యపూర్వలావణ్యమైనయుద్యానవనమును మున్నెన్నఁడును కనియు వినియు నెఱుంగను. ఇది యథార్థమైనవనము గాక మాయావన మని తోఁచెడిని.

గీ. మాయచేఁ బుట్టువస్తువు ♦ మహితశోభ
సత్యమౌవస్తువున కేల ♦ సంభవించుఁ?
జిత్తకల్పితసౌఖ్యవి ♦ శేషమహిమ
యిలను బ్రత్యక్షసుఖమున ♦ కేలఁయుండు?

ఆహా! ఆహా! ఆహాహా!

గీ. చుట్టు జాజిమొక్కలగమి ♦ శోభఁజెంద
నడుమసఖిశోడ సయ్యావె ♦ వెలుగుచుండె
నెలఁత పరివేషయుతరోహి ♦ ణీసమీప
గతశరత్కాలవిధుకళా ♦ కలికవలెను.

గీ. వనితరూపంబు లావణ్య ♦ వైభవమును
గన్నులున్నందు కిప్పుడే ♦ గాంచకుండఁ

కాంచిని నాకన్నులును రెండు ♦ మాయసాగఁ
జలివెలుఁగురాక చేబద్మ ♦ ములనుబోలె.

అయ్యో! నాప్రారబ్ధ మేమొ! ఈనెలఁతకూడ మాయాకల్పిత యని తోఁచుచున్నది. అట్లు కానిచో నిట్టి సౌందర్య మలభ్య ముగదా! [నర్మదవంక కొంచెము సంకుచితాస్యుఁడై చూచు చున్నాఁడు]

నర్మ—అయ్యో! సఖీ! ఇఁక నాయాశ వ్యర్థ మయినది సుమా! రా జేమొ కోపదృష్టినిఁ జూచుచున్నాఁడు.

పురు—ఇక్కడికి నే నెట్లువచ్చితినో తెలియకున్నది. ఇది యేలోకమో. తెలియకున్నది. నే నెవ్వఁడనో కూడ ననుమానింపవలసినట్లు యున్నది. ఈవనమెవరిదో యగమ్యగోచరమై యున్నది. ఆకాంత మతెవ్వరో యేమి తెలియఁగలను? ఆహా! ఇది యంతయు విశ్వామిత్రునిమాయ కదా! అయ్యో! గాధినందనునియింద్రజాలమునఁ బడి చెడితినికదా! ఆహా! గాధినందనా!

గీ. చిఱుతపులినిఁ బెట్టి ♦ చేయి జారగనిచ్చి
దుష్టిఁ జేసి కొంప ♦ ద్రోచినాఁవు
వనము మార్చి స్త్రీల ♦ నునిచి నోరును జార
నిచ్చి యేమి చేయ ♦ నెంచినావు!

అంశు—ఓయి వెఱ్ఱిచక్రవర్తీ! ఈభ్రమ ని న్నింకను విడువకున్నదా! ఓహో! కామదేవా!

ఆ. ఇంక వెఱ్ఱిభ్రమల ♦ గొంకెమునీతని
పొరి నిఁకొక్కగట్టి ♦ పోటుఁ బొడుము
నుమువుచుండి తప్పు ♦ పొడిదెబ్బలను లక్ష్య
పెట్టనట్టిశిష్యు ♦ మొట్టువాఁడు.

నర్మ—అయ్యో సఖీ! ఇఁక నుపేక్షింప నాజీవనాపేక్ష నీకు లేదును మా! ఆమహారాజు నిచ్చటి కెట్లు తీసికొనివచ్చెదవో!

నవ—అవశ్య మిప్పుడే తోడ్కొని వత్తును. (అని రాజువద్దకు వచ్చి నిలిచినమస్కరింపుచున్నది.)

పురు—కళ్యాణమస్తు! ఎవరవునీవు?

నవ—నే నురగలోకమహారాజు పుత్త్రికయగునర్మదయొక్కసఖిని.

పురు—ఇదియు రగలోకమా! ఈవనము మాయావనము కాదుగద! మీకాంత మాయాకాంత కాదా! నీవును మాయాస్వరూపమవు కావా!

నవ—ఇది యథార్థమయినయురగలోకము, మేము యథార్థమయిన కాంతలము. మానర్మద యచ్చట నున్నది. కానఁ దా మచ్చటికి దయచేసి మాచెలికి మీదర్శనలాభమును గలిగించి యాకన్యారత్నముచే నొసఁగఁబడు—

పురు—(నవ్వుచు) కన్యకారత్నమేకద. అటులైన మాయాకన్యకయైనను, నీయాహ్వానమునకు సమ్మతించితిని.

ఆ. ఉర్వి మాయ యంచు ♦ నూరకుంటిమె నీదు
కాంత మాయయైన ♦ చింత లేదు
మాయలోనిమాయ ♦ మఱి సౌఖ్య మగునాట
కంబులోని నాట ♦ కంబుకరణి.

అంశు—ఆహా! ఏమి ఈమదనవేదాంతము.

నర్మ—(తనలో)ఓయదృష్టదేవతా! నన్ను శీఘ్రముగఁ గటాక్షింపుము.

పురు—మీచెలి యొద్ద కిదుగో వచ్చుచుంటిని. దారి చూపుము. ఓకాంతా నీపే రేమి.

నవ—అయ్యా! నన్ను నవమాలిక యనిపిలుతురు.

పురు—నవమాలికా! ఇఁక నా కీచిత్రఫలకముతోఁ బని యేమి!

ఆ. పడఁతిఁ జూడనపుడు ♦ పనికివచ్చెనుగాని
పడఁతిఁ జూడ దీని ♦ పని యిఁ కేల?
కత్తి కంఠసూత్ర ♦ కాలంబునను కాని
కలయనున్న వేళఁ ♦ గత్తి యేల?

(అని చిత్రమును బారవైచుచున్నాఁడు)

అంశు—భళీ! రాజా! వివాహము కాకమునుపే గర్భాధానమును సూచించుచున్నావు!

నర్మ—చిత్రమా! ఉప్పొంగుచుంటివిగదా! (నవమాలికాపురుకుత్సులు నర్మదాసమీపమునకుఁ బోయిరి)

నవ—సౌమపురుకొండపై చంద్రుఁడెక్కినట్లీ సీచంద్రకాంతశిలావేదికపై నో రాజా! తాముదయచేయుఁడు.

నర్మ—(తనలో) ఓసి పెట్టిదానా! నాచిత్తమువలెనదియును గరఁగిపోవునుకాదటే!

పురు—(కూర్చుండి) నర్మదా! నీవుకూడ కూర్చుండుము.

(నర్మదానవమాలికలు నిలుచుండియున్నారు.)

పురు—నవమాలికా! మీసఖి క్షేమమేకదా

నవ—తమయనుగ్రహమువలన క్షేమమే-అయిన-

పురు—అయిన నేమి?

నవ—మరియేమియు లేదు. తామేమో పరితాపపడుచుండిరనుచింతయామెకు గలిగియుండెను.

పురు—ఆపరితాపమైనను, మీసఖినిఁగూర్చియేకదా!

నర్మ—నేను మీకట్టివిచారమును గలిగించితి నని లజ్జపడుచున్నదానను.

పురు—నీవుస్వయముగా గలిగించినపరితాప మేమియు లేదు. నీచిత్రఫలకముఁ జూచి యత్యానంద మొందితిమి. నీయథార్థస్వరూపమును

జూచి పరవశులమే యయితిమి. ఇఁక నా కిదివరకుబరితాపముగ లుగఁజేసి నీకటాక్షమున్నచో శిక్షాపాత్రుఁడు కానున్నవాఁడు.

నవ—ఎవఁడయా! వాఁడు!

పురు—మన్మథుఁడేకద.

నవ—నీవుపరితాపకారణమవు కావని యీమహారాజు పలుకుచున్నచో నింకను లజ్జయెందులకు? మోమెత్తి వారితో మాటలాడుము.

నర్మ—నాకు వంకలు దిద్దుమని నీతో నెవరును జెప్పియుండలేదు.

పురు—నర్మదా! ముఖము వంచినయెడల ముఖచంద్రకాంతిచేఁ గుచచక్రవాకములు పరితపించునుసుమా!

నర్మ—సఖీ! ఇతఁ డెదుట వెల్గుచుండనట్టిలోపము తటస్థింపదని నీవు చెప్పరాదా. (అని మోమెత్తి కన్నులార జూచుచున్నది.)

పురు—ఆకారణముననేకదా నీనేత్రపద్మము లిప్పుడు సంపూర్ణముగ వికసించినవి.

నవ—నర్మదా! నీవు నిలుచుండుటచేత మహారాజునకు బాధగ నున్నది సుమా.

పురు—బాధలేదు సరేగదామిఁదిమిక్కిలి యానందకరముగ నున్నది.

నవ—(తనలో) ఎందుచేతనో యిటు లనుచున్నాఁడు!

పురు—నావంటివాని నీకాంత పతిగ నంగీకరించు నని యాశనాకు లేక పోయినను, అంగీకరించితి నని చెప్పువిధముగ సతి పతియెదుట నిలువబడిన ట్లీమెనాయెదుట నిలువబడుటయే నాకుపరమసంతోషముగనున్నది.

నర్మ—(కూర్చుండి, తనలో)ఈయస్వాతంత్ర్యమును నాకుమనోహరముగనే యున్నది.

పురు—నవమాలికా! ఒకరియెదుట నొకరు గూర్చుండ నామెయు నేను నెట్లుంటిమో చెప్పఁగలవా?

నస—వేఱె చెప్పనేల? పెండ్లికొడుకు, పెండ్లికూఁతురువలె నున్నారు. నేనుమాత్రము నడుమ తెరవలెనింకఁ గొంచెము స్థగ నున్న దానను.

నర్మ—మహారాజా! మీవృత్తాంతము కొంచెమింతకుముందే యిచ్చట వినియుంటిమి. మీ కాకోపిష్టమునియొక్క శాపముగలిగెనని విచారించితిమి.

పురు—శాపము పరమేయైనట్టి మాహాత్మ్యమువల్లనే కదా దుర్లభమైనయురగలోకమును జేరితి నతఁడు నన్నిక్కడకుఁ దీసికొనివచ్చినాఁడని తోఁచుచున్నది. ఆతనివరమాహాత్మ్యమువల్లనే కదా యిట్టియపూర్వదర్శనలాభము గలిగినది. అంతమట్టనె కేయా మునియొక్క వరమాహాత్మ్యముఁ గొప్పదైన నీకటాక్షమాహాత్మ్యమును, నాభాగ్యరేఖయుఁ గదా!

నర్మ—ఒకలోకమువారు మీరు, వేఱొకలోకమువారము మేము; మీకును మాకును సఖ్యము గలిగెడిదని యేకదా.

పురు—అటు లనుచుంటి వేల?

గీ. తరణియొక్కఁడె యొక్కఁడే ♦ ధరణి; ధరణి
యొకఁడె శశి యొకఁడె; యూర్వశి ♦ కొకఁడె శక్తి
నొకరి దృష్టిను దినుసుమ ♦ నొకరు వినుచు
కెన్నాఁటిచో సహవాస ♦ మొప్పు లేదనె?

(నర్మద కోపరక్తనేత్ర యగుచున్నది)

గీ. కొమ్మ నర్మద కేమొకో ♦ కోపరక్తి
గండఫలకములందునఁ ♦ గానుపించెఁ
బండుతమలపాకులను బైఁ ♦ నుండునట్టి
యవిసిపువ్వులు ప్రతిఫల ♦ మైనయట్లు.

నస—కోపకారణ మేమో మీ రెఱుఁగనిది కాదు. ఆసంగతి నేను చెప్పినయెడల బాగుగ నుండదని మీ రడిగితిరి గాన చెప్పెదను.

ధరణీమిత్రులకును కువలయకువలయహితులకువలెనే ఇచ్చటి దూరసంగమమునుమాత్రమే సూచించితి రని—

నర్మ—ఛీ! అనవసరపుమాట లాడెదవ వేల? అవతలికి పొమ్ము.

నవ—(నవ్వుచు) చేత పండు చిక్కిన పిమ్మట డాంకెకట్టులో నవసర మేమి? (అని నిష్క్రమించుచున్నది)

(నర్మద నవమాలికవెంటఁ బోవుచుండఁగాఁ బురుకుత్సుఁ డడ్డగించుచున్నాఁడు)

పురు—పలుపలుకు లేల? నేను నిన్ను సంపూర్ణముగఁ బలచితిని. భూలోకరాజన్యు లందఱును నాపాదసేవఁ జేయుచుండ నేను నీపాదసేవఁ జేయుచు భూలోకమున నీతోనుండఁగలమహాభాగ్యము నీవు నాకు లభింపఁజేయుదువయెడల—

నర్మ—మీరు మహారాజులు. స్త్రీలోలురు. ఆశ్రయించితి ననితలఁచకుఁడు. ఇదివఱకుమీకెందఱుభార్యలో నేనడిగిన నన్ను మన్నింతురుగాక.

పురు—ఇది వఱ కొక్కభార్యయే కలదు. సుమతి యనునది.

నర్మ—ఆమె మీకు నర్ధాంగలక్ష్మియేకద,

అంశు—ఆహా! భూలోకకన్యకల కుండుసౌభాగ్యములలో సగభాగమైన నీ యురగలోకకన్యకల కుండదుగదా!

పురు—గీ. ఆమె యర్ధాంగలక్ష్మియే ♦ యైన నిన్ను
వెలఁది! నానెత్తిమీఁదను ♦ బెట్టుకొందు
నర్ధనారీశ్వరుం డైన ♦ యతఁడు పరమ
దయను దలమీఁద గంగను ♦ దాల్చుకవలె.

నర్మ—యథార్థమేనా!

పురు—ఉరగకాంతకువలె రెండునాలుకలుండునా?

నర్మ—మీరు దానికి ప్రభువే యయితిరే! అయినను నాచేలియందు నీచేలినిఁ బెట్టుము.

పురు—(చేతిని బట్టుకొని) ఇదియే పాణిగ్రహణముసుమా.

(నర్మదను కౌఁగిలించుకొనుచున్నాఁడు.)

అంశు—ఆహా వారిసౌభాగ్యము.

సీ. మంజుకాంతుల దేదీప్య ♦ మానుఁడతఁడు
కుసుమకోమలి యీనితంబిఁ ♦ గూడి కనుల
పండువయి యుండునవ్వహో ♦ భవ్యలక్ష్మి
యలసవంతమునఁ జూపుచు ♦ నలరెనిల్లు.

పురు—దేవీ! అదిగోచూడుము. పైపైనల్లుకొనినజాజిపూలతలు రాల్చిన కుసుమములచే వేయనిపానుపు గలిగి సమీపస్థమణులయొక్క, కాంతిచేఁ బెట్టనిదీపములు గలిగి ప్రకాశించుచున్నయీపూఁబొదరిల్లు మిక్కిలి శోభగ నున్నదిసుమా!

నర్మ—(గడ్డము పట్టుకొని) తొందరపడకుము. తండ్రిచాటుదానను. అతఁడు నాకు వివాహము శీఘ్రమునఁ జేయఁదలఁచి యున్నాఁడు. నీవును నేనును నేఁడు కలిసి యాతనిని దర్శించి అక్కడ సుముహూర్తంబున వివాహ మాడుదము.

అంశు—సర్మదా! బుద్ధిమంతురాలవు.

పురు—ఓహోహో! నర్మదా! నేనుసీమాట కెదురాడఁగలనా! అయినను ఈనాయుంగరమును నీవు ధరించి నీయుంగరమును నాకిమ్ము. (ఉంగరములు మార్చుకొని) ఆహా! మణిమంతునిఁ జేరుటచే నా యుంగరము నీచేతిని మఱింతశోభగా నున్నది.

అంశు—వీరిద్దఱు పరస్పరమోహావిష్టులైరి. ఇఁక నేను సంతసించితిని. ఈతని నిప్పుడే భూలోకమునకు తీసుకొనిపోక యిచ్చటనే యుంచినయెడల మహారాజుగా నెట్లనుమానింతురో. ఏమి యసాధ్య మగునో. ఇతఁడా! మహారాజు; ఈమె మహారాజపుత్రిక. వీరిద్దఱిని మహారాజుగారిసెలవు లేనిదే శాశ్వతముగఁ గూర్చుట

తప్పుపని. వీరికి నొకరియెడ నొకరి కనురాగ మెటులుండునో కని పెట్టుటకు మాత్రమే వీరిని తీసుకొని వచ్చితిని. వీరిని శాశ్వతముగ సంధానపఱుచువాఁడా కాముఁడేన్పఁడే, అదియునుగాక.

ఆ. కష్టసాధ్యమైన ♦ కాంతయైనఁ గలిగెను
శాశ్వతదయ సులభ ♦ సాధ్య గనునె?
రాతిమీఁదిప్రాఁత ♦ రహిం నిల్చునట్లుగా
నిసుకమీఁదిప్రాఁత ♦ యెటులునిల్చు.

కావున సులభసాధ్యయగుచున్న, సీనర్మదనుండి ఈరాజేంద్రుని ప్పుడే వేఱుచేసినఁ గానిప్పిదాంపత్యసౌఖ్యము మరణాంతము నిలిచియుండదు. రాజా!

ఆ. ఇపుడు కష్టమైన ♦ నెంతో సౌఖ్యము ముందు
నీవుగాంచఁగలవు ♦ నిశ్చయముగ
ప్రథమమందుఁ గుట్టు ♦ బాధ నొందినఁగాని
కుండలములు చెవ్లఁ ♦ గూర్పఁబడునె?

గీ. మఱియుచును ముగ్గుఁగొలుపుచు ♦ మోసయుదీరి.
బాదలు మోహనవిద్యచే ♦ బాదుపునాఁడ
పోరి కుశాళించి కుల్కు సా ♦ వురపుకోటి
మీఁద పేవేగ వల్రేయు ♦ మృగయుమాడ్కి.

ఇదిగో మోహనవిద్యను బ్రయోగించితిని.

నర్మ—నాథా! నాకు నిద్ర వచ్చుచున్నది.

పురు—దేవీ! అభ్యంతర మేమి? నాతొడపై తల నిడుకొని పరుండుము. (నర్మదయట్లు చేయుచున్నది.) ఆహా! ఏమిది నాకుగూడ నిదురవచ్చుచున్నది. నిలుప శక్యముగాకుండ నున్నది. ఇట్టినిద్ర రయే భూలోకమున నుండఁగ నావహించినది. ఇప్పుడేమిమూడు నో కదా! ఓనర్మదా!

